కేవలము లోగడ నుడివినట్లు మన పూర్వులు తమ ప్రతిభను చూపుటకై గణితశాస్త్రముప్రకారము లెక్కవేసిన సృష్ట్యాది సంఖ్యలను తెలుపుటకే ప్రాచీనుల పేరిట కల్పింపబడిన యొక చారిత్రక నవలాప్రపంచముగ నున్నది. మహాభారతమును రచించిన వ్యాసమహర్షి కాలములో యివి యన్నియు నూహింపబడి పూర్వ పురాణములందును తదితర గ్రంథములందును చేర్చబడియుండును. అతడే వేదములనుగూడ భాగించి వేదవ్యాసుడయ్యెను. ప్రాచీన ఋగ్వేదములు బహు స్వల్పముగా నుండును దానిలో కొంతభాగము క్రీ.పూ. 6350 ప్రాంతమున రచింపబడియుండును. ఏలన, ఋగ్వేదమున ఇక్ష్వాకు, పురూరవుడు, పూరువులు, తుర్వసులు, యదువులు, ద్రుహ్యువులు, అనువులు, సుదాసుడు, తృత్సువులు, ఆయువు, పురుకుత్సుడు మున్నగు యయాతి వంశీయులు మున్నగువారు పేర్కొనబడుటవల్ల నాభాగములన్నియు వారలతర్వాతకాలములో వ్రాయబడినవనుట స్పష్టము. అప్పటికే కొన్ని ఖగోళనక్షత్రములకు వారి పూర్వీకులపేరిట నామకరణము గావించియుండిరి. ఆకాలమునకే ఆంగిరసులు, భృగు వంశీకులు, కణ్వులు మున్నగు ఋషిగణములు ప్రబలియుండెను. వైవసత్వమను కుమారుడగు యిక్ష్వాకు కాలములో వచ్చిన కృతయుగము క్రీ.పూ. 6651 సం॥ నాటిదని లోగడ యిచ్చిన సూర్యవంశ తరముల సంఖ్యనుబట్టియు, యుగకాలములనుబట్టియు స్పష్టమేగదా. ఆ యిక్ష్వాకు తర్వాతవారే పైన నుడివిన రాజులందరు నని తెలుసుకొనదగియున్నది. ఇక నిక్ష్వాకుకు పూర్వముండిన 6 గురు మనువులకాలము కలిపి యొక యుగము. అనగా 1200 సం॥లు (సావనరీత్యా) కన్న హెచ్చుగాదు. అందుచే మొదటిమనువగు స్వాయంభువు క్రీ. పూ. 7833 సం॥ క్రిందటివాడగుచున్నాడు. తక్కిన మనువుల కాలములనుగూడ మన మీ క్రిందిరీతిని రమారమిగా నిర్ణయింపవచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 స్వాయంభువమనువు | క్రీ.పూ. | 7833 | 5 రైవతమనువు | క్రీ. పూ. | 7100 |
| 2 స్వారోచిష | ,, ,, | 7600 | 6 చాక్షుషుడు | ,, | 6950 |
| 3 ఉత్తముడు | ,, ,, | 7400 | 7 వైవస్వతుడు | ,, | 6750 |
| 4 తామసుడు | ,, ,, | 7250 | 8 ఇక్ష్వాకు | ,, | 6651 |



ఇవి రమారమి అంకెలు. మనుస్మృతిప్రకారము వీరి కాలమానందు మానవుల జీవితము 400 సం॥లుగా లెక్కించి వేయబడినవి. ప్రతి మనువునకు మధ్య పాలించిన రాజులు, వారి కుమార్లు మొదలగువారి కాలములు గూడ నిందే చేరియున్నవి. మనకు కల్పాదిగా చెప్పబడెడి చైత్ర శు ౧ ఒక యుగాదిగా తలంపవచ్చును. ఇదియే స్వాయంభువునాటిదని భావింపవలసియున్నది. వేదములలో జెప్పబడిన యశ్వినీ విషువత్తుగూడ యీ మనువుల కాలములోనిదే ననవలెను. ఇప్పుడు మనము దేవమాన కలియుగము వాడుకొనుచున్నాము గనుకను ఆప్రకారమే దేవమాన సం॥లన్ని పురాణములందును చేర్చబడియున్నవి గనుకను వాని ప్రకారము మన మిప్పుడు చూచుకొనినచో దేవమాన కలియుగారంభమునుండి 4 సామాన్య యుగములు గడచి, 5 వది జరుగుచున్నట్లు కనబడును. మన పూర్వులు శ్రద్ధాళురును, జాగ్రత్త గలవారును అగుటవల్లనే రమారమి క్రీ.పూ. 7833 సం॥ర వరకు గల వృత్తాంతములన్నియు భద్రపరచి పురాణాదులలో అతిశయోక్తులతోనైనను పెంచి చెప్పినందులకు మనము గర్వింపదగినదే. ఒక్క అవెస్తా వాఙ్మయమునందు గాక యింతటి ప్రాచీనవిషయము లేదేశమునను, యేభాషలోను కానరావు. పవిత్రగ్రంథమగు బైబిలులోగూడ కొందరు జనులు పూర్వము 700, 800 సం॥లు జీవించిరని వ్రాయబడినది. మనుస్మృతి 400 సం॥లనియే చెప్పినది. యుగాలవిషయమై యెట్టి యద్భుత కల్పనలు జరిగినను వానిని మనమిపుడు నమ్మజాలము. మన పూర్వుల నెట్లు కొనియాడుకొన్నను వారి ప్రజ్ఞకు సంతసింపవలసినదేగాని సత్యాన్వేషణలో యసత్యమెచటనున్నను త్రోసివేయక తప్పదు. సూర్యసిద్ధాంతమున జెప్పబడిన 7200 సం॥ర కొకసారి వచ్చు అశ్వినీవిషువత్తునే ఋగ్వేదమునందు జెప్పబడినట్లు ధృవపడుచున్నది. ఇప్పుడు మనసిద్ధాంతమునందు పరీక్షిత్తు జననకాలము, భారతయుద్ధకాలము పురాణములందిచ్చిన కాలమునకే సరిపుచ్చియుంటిమి. భాగవతములో జెప్పబడిన కల్యారంభమునే అనుసరించితిమి. నేటి కలియుగసంఖ్యనుగూడ సరియైనదని కనుగొంటిమి. సూర్యసిద్ధాంతమునందలి కృతయుగాంతమను పదార్థమును గ్రహించితిమి. పురాణములలోని తరములసంఖ్యనుబట్టియు నేడు పంచాంగములలో ఇప్పుడు